## కావలెను

భట్టిప్రోలులో (గుంటూరు జిల్లా) ఆంధ్ర దైనిక, సచిత్రవార, భారతి మాసపత్రికలను వారి స్వంతశిక్యతపై విక్రయించుటకు సమర్థులైనవారు కావలెను. వివరములకు:

మేనేజరు,

ఆంధ్రపత్రిక, పి. టి. మద్రాసు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ చైత్ర శు॥ తృతీయ

1949సం॥ ఏప్రిల్ 1 శుక్రవారం

శు॥ తిథి రా 3-57 ఘ 24-9 నక్షత్రం ప 3-32 ల 5-18 శు.

శు॥ చవితి ఏప్రిల్ 2 శనివారం

శు॥ చవితి తె 5-17 భరణి 7-27 నక్షత్రం రా 8-32 ల 10-17 శు.

## ఆంధ్రపత్రిక

విరోధి సం॥ చైత్ర శు॥ తృతీయ శుక్రవారం

## శాసనసభా నాయకుని ఎన్నిక

శ్రీ ఓ. పి. రామస్వామి రెడ్డిగారు పోటీనుంచి విరమించుట, వత్సలంగారు ఉపసంహరించుట జరిగి, శ్రీ కుమారస్వామి రాజాగారి పేరు ఎప్పుడైతే పైకి వచ్చినదో, అప్పుడు ఆయన మద్రాసు శాసనసభా కాంగ్రెసుపక్ష నాయకుడుగా ఎన్నికయగుట తథ్యమని భావింపబడెను. కాని, ఈ సందర్భమున జరిగిన సంగతులుమాత్రము ఆశ్చర్యము కలిగింపక మానవు. మంగళవారము జరిగిన పార్టీసమావేశములో ప్రధాని రెడ్డిగారు తాము ఎన్నికకు పోటీచేయదలచినట్లు తెలియజెప్పిరి. అందరు ఏకాభిప్రాయముతో మెలగి నాయకుని ఎన్నుకొనవలెనని విజ్ఞప్తి చేసిరి. పార్టీ పూర్వచరిత్ర గమనించినవారికి అందరికీ, ఏకగ్రీవముగా నాయకుడెన్నుకొనబడుట అసాధ్యమని తెలియును. శ్రీ రెడ్డిగారికికూడ ఆ సంగతి తెలియదనుటకు వీలులేదు. అయితే "క్రిందటిరోజున పార్టీ సభలో విభేదములు లేక, ఏకగ్రీవముగ నాయకుని ఎన్నుకొనవలెనని విజ్ఞప్తి చేసియుంటిని. కాని నా విజ్ఞప్తి ఫలింపలేదు. అంతేకాదు. వర్గ రాజకీయములు ఇంకను ప్రాబల్యము వహించుచున్నవి. అందువల్ల నాయకత్వపోటీనుండి నేను విరమించుకొనుచున్నాను." అని వారనుట హేతుబద్ధముగ కనబడుటలేదు. తాము విజ్ఞప్తి చేసినంతమాత్రమున ఒక్కసారిగా పార్టీలో విభేదములు అంతరించునని వారనుకొనిన అది భ్రమ అయియుండవలెను. లేక, వారికి పార్టీ రాజకీయములు అర్థము కాలేదని చెప్పవలెను. కాని అలా అనుటకు వీలులేదు. మొన్న రాత్రికి నిన్న మధ్యాహ్నమునకు గల వ్యవధిలో ఏదో జరిగియుండవలెను. దానినిగురించి తరచుట అనవసరము. కాని, ముగ్గురినుంచి ఇద్దరు మాత్రమే మిగిలి, ఉభయులు [illegible] పోటీ చేయుటలో [illegible] గమనించే రెడ్డిగారు [illegible] విరమించి [illegible] [illegible]గారి, [illegible] శ్రీ

కుమారస్వామిరాజాగారి అభ్యర్థిత్వమునకు దారి తీసినది. శ్రీ రెడ్డిగారు, భక్తవత్సలముగారు కూడ శ్రీ కుమారస్వామి గారికి తోడైరి. వారిద్దరి ఉపసంహరణ జరిగినది గాని, అంతటితో పార్టీ వర్గవిభేదములు సమసిపోయినవనుటకు వీలులేదు.

పార్టీనాయకుడుగా ఎన్నిక అయినందుకు శ్రీ కుమారస్వామిరాజాగారిని అభినందించుచున్నాము. బహుశః వారిఅభ్యర్థిత్వము పైకి కనపడినంత ఆకస్మికం కాదనవచ్చును. కాబట్టి అంత ఆశ్చర్యపడ నవసరము లేదు. శ్రీ కుమారస్వామి రాజాగారికి ప్రధానిత్వము కొత్తగాని, మంత్రిత్వము కొత్త గాదు. శ్రీ ప్రకాశం గారి మంత్రివర్గంలో మంత్రిగా యుండిరి. అయినప్పటికీ వారు నిర్వహించవలసిన బాధ్యతలు అసామాన్యములు. ఆయన చెప్పినట్లు చెన్న రాష్ట్రములోని పరిస్థితులు విచిత్రములు. వీటిని గమనించి, వాటిని అధిగమించి ప్రభుత్వమును నడపగలరని ఆశించుచున్నాము. పెద్ద విషయములందు మంత్రివర్గము ఇంతవరకు కాంగ్రెసు విధానమునకు విరుద్ధముగ నడచినదని అనుటకు ఎవరు సాహసించకపోవచ్చును. కాని, కొన్ని విషయములందు మాత్రము విరుద్ధముగ వ్యవహరించినదని చెప్పవచ్చును. ఉద్యోగ నియామకములందే కాక చివరికి విద్యాసంస్థలందు ప్రవేశమిచ్చుటయందు, కుల ప్రాతినిధ్యవిధానమును అనుసరించి కేవలము కాంగ్రెసు సిద్ధాంతములకు విరుద్ధముగ నడచినదను నిందను తప్పించుకొనజాలదు. పరిపాలనా విధానముకూడ కావలసినంత పటుత్వముగ నడపలేదు. దానికి పార్టీలోని విభేదములు చాలవరకు కారణము. ఒకపక్షములో యుండవలసిన శిక్షణ, ఐక్యతాభావము కనుపడలేదు. వాటిని సరిదిద్దుటకు ప్రయత్నించినగాని శ్రీ కుమారస్వామిగారు ఎంత ఉత్తమ దృక్పథముతో వ్యవహరింప ప్రయత్నించినను ఫలితముండదు. శ్రీ కుమారస్వామి రాజాగారికి మంత్రివర్గమును పునఃనిర్మితము చేయుటకు అవకాశము ఏర్పడినది. పునర్నిర్మితము కావలెనని పార్టీయందును ప్రజయందును తీవ్రాభిప్రాయమున్నది. అయితే వారు ఈ పునర్నిర్మితము చేయుటలో పార్టీలోని వివిధవర్గములనుండి, ప్రతిభావంతులైన సహచరులను పేర్కొనగలరని ఆశించుచున్నాము. అది లేని పక్షమున మంత్రివర్గము పటుతరముగ వ్యవహరింపజాలదు. ఇప్పటివరకూ మంత్రివర్గములో యున్న కొంతమందిని కదలించి వారిస్థానే కొత్తవారిని తీసికొనుటకూడ అవసరము. అది జరుగనంతకాలము ప్రతిసంవత్సరము నాయకుడు మారుట మంత్రివర్గమునకు అస్థిరత్వము తప్పదు.

## నగరమధ్యంలో తపాలా రేట్ల తగ్గింపు

### ఇండియా ప్రభుత్వ సంకల్పం

ఢిల్లీ, మార్చి 30: ఒక నగరంలోని ఒక భాగంనుంచి ఇంకొకభాగానికి వ్రాయబడే స్థానిక ఉత్తరాల రేట్లను తగ్గించవలెనని ఇండియా ప్రభుత్వమువారు [illegible] యోచిస్తున్నారు. ఢిల్లీలోనే ఒక పేటనుంచి ఇంకొక పేటకు [illegible] ఉత్తరాలు [illegible] [illegible] అంగీకరించవలసి యున్నది. [illegible] [illegible]

## మహారాణా ప్రతాప సింహుని ఆశయాలు, వాంఛలు నేడు ఫలించినవి

### రాజస్థాన్ సం॥ రా॥ ప్రారంభ సమయమున సర్దార్ పటేలు ఉద్బోధ

జయపూరు, మార్చి 30: భారత ఉపప్రధాని సర్దార్ పటేలు నేడు రాజస్థాన్ సంయుక్తరాష్ట్ర ప్రారంభోత్సవము జరుపుచు రాణా ప్రతాపసింహుని ఆశయములు, వాంఛలు నేటికి సఫలమైనవని చెప్పిరి. భారతదేశ పతనమునకు కారణము సంకుచిత రాష్ట్రీయ మానమని, దేశము చిన్నచిన్న ఖండములుగా విభజించుటయని సర్దార్ చెప్పుచు ఇప్పుడు మనకు స్వాతంత్ర్యము చేకూరినదిగనక మనము మొదట భారతీయులముగాను, తరువాత రాజస్థానీయులముగాను ఉండవలెనని ఉద్బోధించిరి.

సభాభవనము భారతజాతీయ పతాకతోను, రాజస్థానమందలి అన్ని సంస్థానముల పతాకములతోను అలంకరింపబడియుండెను. నగరవీధులుకూడ పతాకలతోను, తోరణములతోను అలంకరింపబడియుండెను. రాజప్రముఖుని ప్రక్క సర్దారు రత్నఖచితమైన సువర్ణసింహాసనముపై ఆసీనులై యుండిరి.

మొదట సర్దారు రాజప్రముఖునిచే ప్రమాణముచేయించిరి. తరువాత రాజప్రముఖుడు ఉపరాజప్రముఖునిచేతను, ప్రధానిగా నియమింపబడిన హీరాలాల్ శాస్త్రిగారిచేతను ప్రమాణములు చేయించిరి. పండిత నెహ్రూ, గవర్నరు జనరలుగారలు పంపిన శుభసందేశములు సభవారికి చదివి వినిపింపబడెను.

సర్దారు రాజస్థాన్ యూనియను ప్రారంభించుచు నేటి సంఘటన ఎంతో మహత్తరమైనదో, ముందు తామెట్టి సమస్యలను పరిష్కరించవలసియున్నదో ఏపుడైన జ్ఞాన్యతలెంతభారమైనవో తాను గ్రహించుచుండెననిరి. ఇది మనము భగవంతుని కృపకై యాచించవలసిన సమయమనిరి. తన విమానమునకు కల్గిన ఆపద్విషయమై ఆయన ప్రస్తావించుచు రెండు గంటలకాలము తనకు ప్రపంచముతో ఎట్టి సంబంధము లేకపోయెననిరి, తనను తాము భగవంతుని సాన్నిధ్యములోనే యుంటిననిరి. కనుక ఆయన కృపకొరకు, సహాయముకొరకు మార్గదర్శకత్వముకొరకు ప్రార్థించవలెననిరి.

#### రాజప్రముఖుడు ప్రథమ సేవకుడు

రాజప్రముఖులుగా ఎన్నుకొనబడినందుకు సర్దార్ జయపూర్ మహారాజు అభినందించిరి. ఇంతవరకు జయపూరు మహారాజు జయపూర్ ప్రజల ప్రథమసేవకుడుగానుండెనని యిప్పుడు రాజస్థాను కంతటికి ప్రథమసేవకుడయ్యెననిరి. జబ్బుగల్ల ఉదయపూర్ రాణా సభలో లేనందుకు సర్దార్ చింతించిననుతానెన్నడు అయనను మరువలేదనిరి. మహారాణా ప్రతాపసింహుని ఆశయములు, వాంఛలు నేడు సఫలమైనవనిరి.

మహారాజప్రముఖుడుగా ఎన్నికమైనందుకు సర్దార్ ఉదయపూర్ మహారాణాను అభినందించుచు, ఆతని పూర్వీకుల స్వప్నములు నేడు కార్యరూపము దాల్చినవనిరి. రాజస్థాన్ యూనియన్ స్థాపనమునకు సహాయపడిన సంస్థానాధీశ్వరులను సర్దార్ అభినందించి వారుచేసిన త్యాగమును ప్రశంసించిరి. సంస్థానాధీశ్వరులకు దేశమంతయు ఋణపడియున్నదనిరి.

భవిష్యత్తులో దేశము ఆక్రమించవలసిన స్థానము విషయమై తాను సంస్థానాధీశ్వరులతో చర్చించెనని సర్దారు చెప్పుచు, ఐకమత్యము, శాంతి ఉత్తమ మార్గమని సంస్థానాధీశ్వరులు అంగీకరించిరని, ఆమార్గమునే అవలంబింప అంగీకరించిరని చెప్పిరి. భారతదేశ గౌరవ ప్రతిష్ఠలు హెచ్చవలెనని ఆయన చెప్పుచు ఈవిషయముగా నేమనము జన్మించిన దేశపు భవిష్యత్తు సహోదరులుగా సంకలనుని. భవిష్యత్తు సహకారముగా సంకటన్న యిప్పుడు త్యాగములు గావించినవారు తగిన ప్రతిఫలము పొందవలెననిరి. గాంధిమహాత్ముని శక్తిగాని, తనను గాంచ లేకపోయినప్పటికీ గౌరవము కలిగెనని, త్యాగమే ఆయన గొప్పతనమునకు కారణమని సర్దారు చెప్పిరి.

దేశము స్వాతంత్ర్యములో [illegible] పథనో వివరించుచు సర్దారు యిట్లనిరి:— "దేశము స్వాతంత్ర్యములో పడిపోవుటకు కారణమగు పరిస్థితులు తిరిగి ఏర్పడకుండ మనము చూడవలెను. మనము [illegible] యత్నముచేసితిని. ఇంక రము ఎన్నటికి నీకము కాకుండుటకు మనము చిన్న చిన్న రాజ్యములుగా చీలిపోకుండ [illegible]. మనపృత్కృత [illegible] సంపాదించినాము. ఎన్ని అవకాశములు కలిగినను, ఎన్ని విపత్తులు వచ్చినను మనము నీకము కాకుండ తేని. మనము నీకముగా నిలిచియే ప్రభువు. ఇదే ప్రార్థ

మున్నడు కనిపించని యుద్ధగవంత ఐకమత్యము మనకిప్పుడు కలిగినది. ఇక ముందు మన స్వాతంత్ర్యముయొక్క ఫలితాలు లభిస్తామని అనుకొనుటవల్ల మనము పూర్తిగా గెలిచినవని ఎన్నటికిని సఫలకుండా మనము చూడవలెను. ఈపనిలో రాజస్థానమందలి సంస్థానాధీశ్వరులు, ప్రజలు సముచితమైన పాత్రనహింపవచ్చును.

రాజస్థాను సైన్యాధిక, చారిత్రిక సత్సంప్రదాయములను సర్దార్ వివరించి చెప్పి ఇప్పుడు రాజస్థానమందలి అన్ని సంస్థానములు ఏకమగుటచే తాము జయపూర్ వారని, తాము ఉదయపూర్ వారని సంకుచిత దృష్టితో లెగించుకొనిని, అందరు భారతీయులను దృష్టి అలవరచుకొనవలెననిరి. మొదట తాము భారతీయులని, తర్వాత రాజస్థాన్ వాసులని తలపవలెననిరి. రాజప్రముఖులు మన్ననుపొందినవారై కొన్ని ప్రమాణములను గూర్చి సర్దారు ప్రస్తావించుచు అందుచల్లకలుగు బాధ్యతలను వారికి జ్ఞాపకముచేసిరి. ఇంతవరకు ఈ సంస్థానములమధ్య యేర్పడియుండిన హద్దులను తొలగునట్లుచూచి రాజస్థానమందలి అందరిని సమానముగా చూడవలెననిరి. ఐకమత్యమునేనిరొకడల ప్రపంచములో మనము ఏనుకబడి పోయెదమనిరి. జాగిర్దారుల విషయమై సర్దారు ప్రసంగించుచు, దేశాభివృద్ధికి తోడ్పడుటకు వారికి మంచి అవకాశము లున్నవని, ముందెప్పుడో బలవంతముగా చేయవలసివచ్చు పనిని యిప్పుడే వారు ఐచ్ఛికముగా చేయవచ్చుననిరి.

సేవయే ప్రధానముగా ఎంచవలసినదని సర్దారు కాంగ్రెసువాదుల నుద్బోధించిరి. సేవానిరతియే మనకు గౌరవప్రతిష్ఠలు కలిగించెననిరి. అధికారాపేక్షపులకు ప్రాకులాడకుండ ప్రజలకు సేవచేయవలెననిరి. గాంధిమహాత్ముని సేవామార్గము సకలం దీంచకలెనని ఉద్బోధించిరి. సద్భావముతో సేవ చేయవలెననిరి. [illegible] సేవ అవసరమనిరి. పండిత హీరాలాల్ శాస్త్రిపై గొప్పబాధ్యత పడినదనిరి.

#### శాసనబద్ధముగా ప్రవర్తింపుము

పరాధీనతను తొలగించుటకు మనము పోరాడితిమని, ఇప్పుడు మన బలహీనతలను తొలగించుటకు కృషి చేయవలెనని సర్దారు చెప్పిరి. బ్రిటిషు పరిపాలనలో మనము శాసనములను ధిక్కరించుచుంటిమని చెప్పుచు యిప్పుడట్టిది పనికిరాదనిరి. ఇప్పుడు మన శాసనములయెడల గౌరవము కలిగియుండవలెనని, ఇతరులు వానిని గౌరవించునట్లు చేయవలెనని చెప్పిరి. రాజస్థాను ప్రజలు ఈభావములో పనిచేసినప్పుడే సంస్థానాధీశ్వరులనుండి పొందిన స్వాతంత్ర్యమును నిలుపుకొనగలుగుదురనిరి. సంస్థానాధీశ్వరులయెడల ప్రేమ చూపవలెననిరి. రాజస్థాన్ ప్రజలు పోలీసుల దుడ్డుకర్రచే పరిపాలింపబడరాదనని, ప్రేమచే పరిపాలింపబడవలెననిరి. రాజకర్మమును, ప్రజాకర్మమును వారు బాధగా గ్రహించవలెననిరి. రాజస్థాన్ స్థితిని, భారతదేశస్థితిని అభివృద్ధిపరచుటకు వారు కృషిచేయవలెననిరి.

సభాప్రారంభమున జయపూరు మహారాజుగారు సర్దార్ పటేలును ఆహ్వానించుచు, రాజస్థాన్ ప్రజల తోడ్పాటుతోను, ఇండియా ప్రభుత్వ తోడ్పాటుతోను రాజస్థాన్ నూతనప్రభుత్వము తమ్ముగు గల సమస్యలన్నిటిని జయప్రదముగా పరిష్కరించునను నమ్మకము వెలిబుచ్చిరి. సర్దార్ పటేలు ఈ యూనియను ప్రారంభించుటెంతయు సముచితముగా నున్నదనిరి. ఇతర ప్రాంతములలో జయప్రదముగా కొనసాగింపబడిన విధానము యిప్పుడు రాజస్థానకు వర్తింపబడుచున్నదనిరి. ఈ యూనియను స్థాపన రాజస్థాను చరిత్రలో ఒక మహాఘట్టమని ఆయన చెప్పుచు, ఈ యూనియనును సర్దారు ప్రారంభించుట ఎంతో సంతోషదాయకముగా నున్నదనిరి.

#### ఢిల్లీకి సర్దార్ పునరాగమనము

న్యూఢిల్లీ, మార్చి 31: రాజస్థాన్ సంయుక్తరాష్ట్రమును ప్రారంభించుటకు జయపూరు వెళ్లిన భారత ఉపప్రధాని సర్దార్ పటేలుగారు నేడుఉదయము విమానములో ఢిల్లీ తిరిగివచ్చిరి. ఆ విమానములోనే [illegible] మహారాజుగారు గూడా విచ్చేసిరి.

## విశాఖపట్నానికి బర్మా భారతీయులు రాక

విశాఖపట్నం, మార్చి 31: బర్మానుంచి భారతీయులు, రెండువేలమంది జలదుర్గ నౌకలో నేటిఉదయం విశాఖపట్నం చేరినారు. వీరికి కాంజికల్ సహాయాధికారి నాజర్‌పోలిరావు, ఎం. నరసింహారావుగార్లు భోజనం మొదలైన ఏర్పాట్లు చూచుచున్నారు. వీరిని వీరి స్వస్థానాలకు పంపే కార్యక్రమం నేటిసాయంకాలం నుండి ప్రారంభం కాగలదు.

## ఆంధ్ర విశ్వవిద్యాలయం

వాల్తేరు, మార్చి 30: శ్రీ కె. విశ్వేశ్వరరావు ఎం. ఎస్. సి. గార్కి డాక్టర్ ఆఫ్ సైన్సు డిగ్రీ ఒసంగబడును. [illegible] విశ్వవిద్యాలయ రిజిష్ట్రారు గారు ప్రకటించిరి.

## ఆకాబావద్ద ఇరువైపుల సైనికుల తగ్గింపు

### ట్రాన్స్‌జోర్డాన్‌తో ఇజ్రాయిల్ సంధి

రోడ్సు, మార్చి 30: ఆకాబా ప్రాంతములో పాలస్తీనా సరిహద్దున కిరువైపుల నున్న సైన్యములను తగ్గించివేయవలెనని ట్రాన్స్‌జోర్డాన్, ఇజ్రాయిల్ రాయబారులు అంగీకరించిరి. సంధి ఒడంబడిక ముసాయిదాను తమతమ ప్రభుత్వములకు నివేదించి వారి అనుమతిని పడయుటకై ఉభయపక్షముల రాయబార వర్గనాయకులు గతరాత్రి రోడ్సునుండి తమ రాజధానులకు పయనమై వెళ్లిరి. ఇజ్రాయిల్ ట్రాన్స్‌జోర్డాన్‌తో సంధి కుదుర్చుకొనుట బ్రిటన్‌తో సంధి కుదుర్చుకొనుటయేనని చెప్పవచ్చును. అన్నిటిలోకి జటిలమైనదని భయపడుచూ వచ్చిన సమస్య కొంతవరకుగా తీరిపోయిందనీ, ఇక భవిష్యత్ వ్యవహారంలో కొత్త చిక్కులేవీకల్గకపోవచ్చునని ఇజ్రాయిల్ రాయబారవర్గంవారు అభిప్రాయపడుచున్నారు.

జెరుసలేముకు దక్షిణంగా ఉన్న హెబ్రాన్ మొదలుకొని మృతసముద్ర పశ్చిమతీరము వరకున్న సైనిక సరిహద్దు ఇంకా నిర్ణయం కాలేదు. పుణ్యతీర్థయాత్రా సౌకర్యముల విషయమై కూడా ఉభయ పక్షములకు ఇంకా ఒడంబడిక కుదరలేదు. ఈ క్రింద పేర్కొన్న అంశములను భవిష్యత్ సంప్రదింపులలో తేల్చుకోవడం అవుతుంది:-

జెరూసలెంలోని స్కోపస్ పర్వతమునకు యూదులను యాత్రలు చెయ్యనివ్వడం; జెరూసలేముకు ట్రాన్స్‌జోర్డాన్ ప్రజలను రానివ్వడం; లిడ్డా-జెరుసలేము రైల్వే లైనుమీద అరబ్బుల అధీనంలో ఉన్న 6 మైళ్ల నిడివిగల భాగమును ఇజ్రాయిల్‌కు అప్పగించుట;

బెత్లహేమ్—జెరుసలేమ్ రోడ్డువద్ద లాట్రన్‌వద్ద అరబ్బులు స్వాధీనపరచుకొనియున్న భాగమును యూదులకిచ్చివేయుట. జెరుసలేములోని యూదుల మస్లిం [illegible] పుణ్యస్థలములకు యాత్రికులను రానిచ్చుట;

తూర్పుపాలస్తీనాలో త్రికోణాకారంగల భూభాగం ఇరాక్ సైన్యం వశంలో ఉన్నది. ఇజ్రాయిల్‌తో తన తరఫున కూడా ట్రాన్స్‌జోర్డానే రాయబారములు జరుపవలెనని ఇరాక్ కోరింది. కాని ట్రాన్స్‌జోర్డాన్‌తో సంధి కుదిరిన తర్వాత గాని ఈ భూభాగం విషయమై ఎవరితోనూ రాయబారములు ప్రారంభించమని ఇజ్రాయిల్ అన్నది. ఇజ్రాయిల్ అరబ్ జాతులకు మధ్య శాంతిసమావేశం ఏర్పాటుచేయడం సాధ్యం కాదని పాలస్తీనా మధ్యవర్తి సంఘమునకు సన్నిహితులైనవారు అభిప్రాయపడుచున్నారు. పాలస్తీనా మధ్యవర్తి సంఘముతో సంప్రదింపులు జరుపుటకు అరబ్బుల తరఫున ప్రతినిధివర్గంగా వచ్చిన సభ్యులు తమలో తాము చాలా సంక్షోభం ప్రదర్శించుచున్నారు. ఇజ్రాయిల్‌ను మధ్య ప్రాచ్య దేశములు ఆర్థికంగా బహిష్కరించవలెనని వీరు ప్లాను వేయుచున్నారు.

కమీషను పని కాలం చుబాని [illegible] నాలుగోతేదీగా జెరుసలేముకు తిరిగివచ్చునని తెలియుచున్నది.

## ఇజ్రాయిలు సభ్యత్వానికి పాకిస్తాను అసమ్మతి

డమాస్కసు, మార్చి 29: లేక్ సక్సెసునుండి ఇక్కడికి వచ్చిన పాకిస్తాను విదేశాంగ మంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్, ఐక్యరాజ్య సమితిలో ఇజ్రాయిలు సభ్యత్వాన్ని పాకిస్తాను ప్రతిఘటించుననీ, సిరియా, లెబనాను, ట్రాన్స్‌జోర్డాను లకు కలిసి ఒక రాయబారిని నియమించి సిరియాలో ఉంచుతుందని చెప్పాడు.

## ఇండోచైనా ఉత్తర ప్రాంతంలో యుద్ధం

సైగాను, మార్చి 30: ఫ్రెంచి ఇండోచైనాకు చైనాకున్న సరిహద్దులో ఉన్న ఉత్తర ప్రాంతమందు పోరాటంలో ఫ్రెంచి సేనలు పోరాడుచున్నవి. చైనానుండి ఇండోచైనాలోనికి రాకెనని పోరాడుచున్న కమ్యూనిస్టుల మీదను, ఇండోచైనాలో తిరుగుబాటు చేయుచున్న వియత్నాం కొరుల మీదను ఫ్రెంచి నిమానములు ఫ్రెంచి సేనలు సోమవారము నాడు యుద్ధము చేసెను. ఈ పోరాటంలో 60 మంది చైనాకమ్యూనిస్టులు మరణించిరి. ఓటమికి [illegible] వచ్చిన చైనాకమ్యూనిస్టులు చాలామంది తిరిగి సరిహద్దుదాటి చైనాలోనికి వెళ్లిరి.

లాంగ్‌సోం, [illegible] మధ్య ప్రదేశమును అచ్చటచ్చట చైనాసరిహద్దులవద్ద దాగియున్నారు. [illegible] ఫ్రెంచి విమానములు దాడి చేయుచున్నవి.

## కాశ్మీర్ కమీషన్ రాయబారములు జటిలదశలో పడినవి

న్యూఢిల్లీ, మార్చి 30: ఐక్యరాజ్య సమితి కాశ్మీర్ కమీషన్ ఇండియా పాకిస్తానులతో జరుపుతున్న రాయబారములు ప్రస్తుతం చాలా జటిలమైనదశలోకి వచ్చినవి. సర్వజనాభిప్రాయం కనుగొనే పనులుగా అవి ప్రయాసతో నడుచుచున్నది. ఆగస్టు 13వ తేదీ తీర్మానంలో చెప్పిన "స్థానిక అధికారులు" అన్న పదమునకు నిర్వచనం, ఆజాద్ సైనికుల ఉపసంహరణ మొదలగు అంశములమీద ఉభయ అధినివేశ ప్రభుత్వ ప్రతినిధులు భిన్నాభిప్రాయములై ఉన్నారు.

ఉభయ ప్రభుత్వములు కమీషనుకు తాము అందజేసిన యుద్ధవిరమణ ప్రతిపాదనలలో ఈ అంశములమీద పరస్పర విరుద్ధమైన వ్యాఖ్యానములు చేసినవి. కాశ్మీర్ కమీషన్ ఇవాళ అపరాహ్ణం భారత ప్రభుత్వ విదేశాంగశాఖ కార్యదర్శి సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయితో ఒక గంటసేపు సమావేశమై ఈ అభిప్రాయభేదములగురించి చర్చించెను.

పశ్చిమ కాశ్మీర్‌లో పరిపాలన ఎలా సాగుతున్నదీ చూచివచ్చిన సబ్‌కమిటీ ఒకటి ప్రొద్దున కాశ్మీర్ కమీషనుకు అక్కడి స్థితిగతులను నివేదించెను. కరాచీలో జఫ్రుల్లాఖానుతో జరిపిన సంభాషణలు పైసంగతులు సభ్యులకు నివేదింపబడెను. కమీషన్ మళ్లీ పాకిస్తాన్ ప్రతినిధులతో సంప్రదింపులు జరుపుటకై న్యూఢిల్లీనుండి రావల్పిండికి వారంరోజులలో బయలుదేరును.

ఇండియాకు అడ్మిరల్ నిమిట్జ్ రాక పూర్వమే ఉభయ పక్షములకు సంధి ఒడంబడిక కుదుర్చవలెనని కమీషన్ ఆతురతపడుచున్నది ఐక్యరాజ్యసమితి కార్యాలయానికి చెందినవారు చెప్పుచున్నారు. ముందు యుద్ధవిరమణ ఒడంబడిక పనితేగాని నిమిట్జ్ జనవాక్య నిర్ధారణ పని పనులు జరుపడానికి వీలుండదు.

గడచిన రెండు రోజులలో మిక్సికోనుండి 6 గురు, నార్వేనుండి ఇద్దరు సైనిక పరిశీలకులు కాశ్మీర్ వచ్చిరి. వారితో కలుపుకొని కాశ్మీర్‌లో సైనికపరిశీలకుల సంఖ్య ఇంతవరకు 35 కు పెరిగింది.

## మాండలే నగర కౌన్సిల్ పరిపాలన

రంగూను, మార్చి 30: ఇటీవల కొన్ని కమ్యూనిస్టులు ఆక్రమించుకొన్న బర్మా పురాతన రాజధాని మాండలే 10 మంది సభ్యులచే కూడుకొన్న కమిటీచే పరిపాలింపబడుతున్నట్లు తెలియవచ్చినది. కొంతమంది ప్రజలు, నగర పరిపాలన విషయంలో కమ్యూనిస్టులకు కొరెన్లకు తోడ్పడుతున్నారట.

కొంతమంది విద్యార్థులుకూడా కమ్యూనిస్టులకు తోడ్పడుతున్నారట. ప్రభుత్వ కార్యాలయ భవనములనుంచి, తమకిష్టమైన వస్తువులను ప్రజలు తీసుకొని పోవడానికి కమ్యూనిస్టులు అనుమతిస్తున్నారు. భామిలా జిల్లాలో ఎర్రజెండా కమ్యూనిస్టుల సంచలనం ఎక్కువగా ఉన్నదట. వీరు గ్రామములోకి ప్రవేశించి గ్రామస్థులవద్ద నున్న ఆయుధాలను లాక్కుంటున్నారని తెలియుచున్నది.

## అట్లాంటిక్కు ఒడంబడిక

### సోమవారం సంతకములు జరుగును

వాషింగ్టను, మార్చి 31: అమెరికాలో వాషింగ్టను నగరమందు వచ్చే సోమవారంనాడు అట్లాంటిక్కు రాజ్యాలు ఒడంబడికపై సంతకములు చేయబడును. బ్రిటీషు విదేశాంగమంత్రి బెవిన్ అమెరికా వచ్చేసెను. నేడు అమెరికా విదేశాంగ కార్యదర్శి డీన్ అచిసన్‌గారిని కలిసికొని మాట్లాడెను. అచిసన్‌గారు విదేశాంగ కార్యదర్శి అయినపిమ్మట వారిని కలిసికొనుట కిదే మొదటి పర్యాయము. మరొకసారి అచిసన్‌గారితో కలిసికొనిన పిమ్మట రేపువారంనాడు తిరిగి కలిసికొని, ఉత్తర అట్లాంటిక్కు ఒడంబడికలోని యితర రాజ్యాల ప్రతినిధులను విదేశాంగ మంత్రులను కలిసికొనెదను. ఫ్రాన్సు డెన్మార్కు మొదలగు రాజ్యాల విదేశాంగ మంత్రులు కూడా విమానాల మీద ఆయా రాజధాని నగరములనుండి బయలుదేరి వచ్చుచున్నారు.

## మార్షల్ సోకొలొవస్కికి పదవీవృద్ధి

లండను, మార్చి 29: జర్మనీలో రష్యా ఆక్రమణ సైన్యముల సేనానిగా పనిచేయుచున్న మార్షల్ వి. డి. సోకొలొవస్కీని రష్యా ప్రభుత్వ సైనికశాఖ ప్రధాన సహాయమంత్రిగా నియమించడమైనదని మాస్కో రేడియో నేడు ప్రకటించెను. జర్మనీలో రష్యా ఆక్రమణసైన్య సేనాని పదవి ఇదివరకే పరిపాలన చేయుచున్నది జనరల్ వి. వి. చ్యుకోవ్‌కు అప్పగించబడినది.

## రంగూనుక ప్రమాదావస్థ

(1-వ పేజీ తరువాయి)

లిపాలాశాఖా కంట్రోలరు ఆఫీసు ఎదుట సమ్మెదారులు చాలామంది గుంపుగా చేరిరి. వారిని బర్మా పోలీసులు బాష్పవాయు ప్రయోగంచేసి చెదరగొట్టిరి. ఈ సమ్మెచేసిన వారిలో చాలామంది సివిలు ఉద్యోగులు. వీరు ఇటీవల సమ్మె సాగించినందున బర్తరఫు చేయబడిరి. ఆ విధిగా బర్తరఫు చేయబడినవారందరును ఆఫీసు ముమ్మరముల కష్టముగా కూర్చుండిరి. వారిని ప్రశాంతంగా వదలిపొమ్మని పోలీసులు ఎంత చెప్పినను వారు వదలిపోనందువల్ల వారిలో కొందరిని పోలీసులు అరెస్టుచేసిరి. ఆ సమ్మెదారులు గవర్నమెంటును నిరసించుచు కేకలు వేయుచు పోలీసులను చూచి హేళనచేయసాగిరి.

సివిలు ఉద్యోగులు ఫిబ్రవరి 7 నుండి సమ్మెచేసిరి. అప్పుడు వారిని తిరిగి పనిలో చేరవలసినదిగా గవర్నమెంటు ఉత్తరువు చేసినది. లేనియెడల బర్తరఫు చేయబడుదురని ప్రకటించిరి. సమ్మెచేసిన వారిలో 500 మంది భారతీయులు కూడా కలరు. వీరు తటస్థంగానే ఉంటున్నారు. ఈ భారతీయులు కూడా బర్తరఫు చేయబడిరి. కాని యీ బర్తరఫు ఉత్తరువు తర్వాత ప్రభుత్వముచే ఉపసంహరింపబడెను. అందుమీదట వారు తిరిగి ఫిబ్రవరి 28 తేదీన పనిలో చేరిరి. వారికి యివ్వబడుచుండిన గిరాకీ అలవెన్సును తగ్గించుటకు బర్మా ప్రభుత్వము నిశ్చయించెను. ఆ కారణంవల్ల వారు సమ్మెచేసిరి.

## బర్మా భారతయూనియన్ సరిహద్దు

### మూసివేయాలని ప్రభుత్వం తలంచలేదు

న్యూఢిల్లీ, మార్చి 31: బర్మా భారత యూనియన్ సరిహద్దును మూసివేయవలసిన అవసరం ఏర్పడినట్లు ప్రభుత్వం తలంచలేదని భారతవిదేశాంగశాఖ ఉపమంత్రి బి. వి. కేస్కార్ నేడు పార్లమెంటులో ఆచార్యరంగాగారు అడిగిన ప్రశ్నకు సమాధానముగా వెల్లడించెను.

## మిల్లులలో సన్నరకం బట్ట ఉత్పత్తికి ప్రభుత్వ అనుమతి

న్యూఢిల్లీ, మార్చి 29: మిల్లులలో 80వ నెంబరువరకూ నూలు ఉత్పత్తి చేయడానికి 60 మొదలుకొని 80 నెంబరు వరకూ ఉండే నూలుతో సన్నబట్ట తయారు చేయడానికి అనుమతి ఇవ్వవలెనని వస్త్రోత్పత్తి పరిశీలనసంఘం చేసిన సిఫార్సును భారత ప్రభుత్వం ఆమోదించెను. సన్నరకం బట్టకు దేశంలో కావలసినంత గిరాకీ ఉండగా దాని ఉత్పత్తిని నిషేధించడం శ్రేయస్కరం కాదని కమిటీవారు అభిప్రాయపడిరి.

సన్నరకం బట్టల ఉత్పత్తి చేయరాదని నిషేధించినంతమాత్రాన ముతకరకంబట్ట ఉత్పత్తి పెరగదనీ, పైపెచ్చు ముతకరకం బట్టకు గిట్టుబాటైన ధరలు లభించక ఉత్పత్తిని తగ్గించడానికే మిలుయజమానులు ప్రయత్నించవచ్చుననీ, కమిటీవారు అభిప్రాయపడిరి. భారత ప్రభుత్వం 1948 నవంబరులో బట్టల ఉత్పత్తిపై విధించిన కంట్రోల్సును కమిటీ స్థూలంగా ఆమోదించెను. కాని ఈ కంట్రోల్సును అవసరోచితంగా సవరించడానికి వీలుండాలనీ, ఈ కంట్రోల్సు నిర్వహణలో టెక్స్‌టైల్ కమీషనరుకూ ప్రాంతీయ టెక్స్‌టైల్ కూ కేంద్ర ప్రాంతీయ సలహాసంఘములు సలహాలు ఇచ్చుచుండవలెననీ, ఈ సలహా సంఘములలో మిల్లు యజమానుల ప్రతినిధులు, వర్తక ప్రతినిధులు పాంతీయ నియోజకులు సభ్యులుగా ఉండవలెననీ, కమిటీ సిఫార్సు చేసెను. ప్రాంతీయ అవసరములను బట్టి వస్త్రోత్పత్తి కంట్రోల్సును సవరించుచుండవలెనని వారు సూచించిరి. ఈ సిఫార్సు లన్నిటిని ప్రభుత్వ మామోదించెను.

## కొత్త జిల్లా బోర్డులు

### జులయి 2 తేదీనుండి

మద్రాసు మార్చి 30:

నూతనంగా ఎన్నుకొనబడు జిల్లా బోర్డులు 1949 జులయి 2వ తేదీనుండి పనిచేయును.

పంచాయితీబోర్డుల కాలపరిమితి ఏప్రిలు 1 నుండి జులయి 2వ తేదీవరకు మద్రాసు ప్రభుత్వంపెంచిరి.

చిత్తూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటు కూడ జులై 2 వరకు ప్రభుత్వమువారు పొడిగించిరి.

న్యూఢిల్లీ, మార్చి 31: జయపూర్‌నుండి తిరిగి వచ్చిన పిమ్మట భారత ఉపప్రధాని సర్దార్ పటేల్ భారత శాసనసభా భవనములోనికి ప్రవేశించినప్పుడు సభ్యులు సాదరముగ అపూర్వమైన స్వాగత మొసంగిరి. సభమందలి అన్ని వర్గములవారు వినిమయములనేకు హర్షధ్వానములు గావించిరి.

# గాంధీజీ వీలునామాకు అభ్యంతరాలున్నాయా?

## అహమ్మదాబాదు జిల్లాజడ్జి ప్రశ్న

అహమ్మదాబాదు, మార్చి 29 : 1940 ఫిబ్రవరి 20 వ తేదీన మహాత్మాగాంధీ వ్రాసిన వీలునామాకు అభ్యంతరము లేమైనా ఉన్నయెడల తెలుపవలసినదని అహమ్మదాబాదు జిల్లాజడ్జి ఒక ప్రకటనను బిల్లాధికారమునకు ప్రసన్నవార్తను పంపెను.

మహాత్మాగాంధీ 10 సంవత్సరాల పాటు నివసించిన సబర్మతీ హరిజనాశ్రమమునకు కూడ ఈ ప్రకటన పంపబడి ప్రదర్శించబడినది.











# అహోబలస్మారక హరిజన ఆస్పత్రి

## పునరుద్ధరణకు ఏర్పాట్లు

వచిలీపట్నం, మార్చి 28: ఈపట్నంలోని బలరామపేటలోనున్న హరిజన కాలనీలోని హరిజనలకు ఉచితంగా వైద్యసహాయం కలిగించుటకు 1927 అహోబల స్మారక ఆస్పత్రి స్థాపించబడి, కొంతకాలం పనిచేసి, ధనలేమివల్ల వెనకపడినది. దీనిని పునరుద్ధరించుటకు చేయవలసిన ప్రయత్నాలను గురించి చర్చించుటకు నిన్న సాయంకాలం కల్నల్ కె. వి. రమణరావుగారి అధ్యక్షతను సభ జరిగెను. అధ్యక్షులు ప్రథమమున హరిజన ఆస్పత్రి యొక్క ప్రయోజనములను విపులీకరించిరి. శ్రీ శ్రీ డా॥ కోకా అహోబలరావుగారి సేవ ఎంతవారు బందరులో లేరనియు, ఆ డాక్టరుగారి 'స్మారకచిహ్న'ముగ యీ ఆస్పత్రిని నిలబెట్టి శాశ్వతంగా ప్రయోజనకారి అగునట్లు చేయుట యీ పట్నంలోని ప్రతివారిపై బాధ్యత ఉన్నదనియు చెప్పుచూ వ్యక్తులు, దానపరాయణులు, వర్తక, వ్యాపార సంస్థలు విరివిగా విరాళము లొసంగవలెననిరి. తర్వాత మానేజిమెంటుకు శ్రీ చల్లపల్లి రాజావారు అధ్యక్షులుగా ఒక సంఘం ఏర్పాటుచేయబడినది. శ్రీ పిల్లారిశెట్టి పార్థసారథి నాయుడు, తటవర్తి నాగభూషణరావుగార్లు ఉపాధ్యక్షులుగను, డా॥ మునగంటి శేషాచార్యులు, సీలం శెట్టి హనుమంతరావుగార్లు కార్యదర్శులుగను ఏర్పాటుచేయబడిరి. ఆస్పత్రిని యీ నెల 30 వ తేదీన తిరిగి ప్రారంభించుటకును, అందునిమిత్తం నిల్వాలో ఉన్న సొమ్మునుండి రు 300 లకు మందులు కొనుటకు కార్యదర్శికి అధికారమియ్యబడెను. రాష్ట్ర ప్రభుత్వ హరిజన సెయోగక్షేమ శాఖవారిని యీ ఆస్పత్రికి ఒక వైద్యుని జీతముపై పనిచేయుటకు కావలసిన సహాయము నిప్పించవలెనని కోరిరి.

### శ్రీ మామిడి వెంకటార్య జయంతి

శ్రీ మామిడి వెంకటార్యగారి జయంత్యుత్సవము నిన్న సాయంకాలం శ్రీ కన్యకాపరమేశ్వరి ఆలయంలో రావు బహద్దూరు కె. గంగాధరరావుగారి అధ్యక్షతను జరిగెను. శతావధాని దోమా వెంకటస్వామిగుప్త, కొనకళ్ళ వెంకటరత్నం, కొల్లపూడి వెంకట నరసింహారావుగార్లు శ్రీ వెంకటార్యులగారి జీవితమును గురించి ప్రసంగించి ఆయన ఆంధ్రభాషకు చేసిన సేవను కొనియాడిరి.

# శ్రీ తాళ్లపాక అన్నమాచార్యోత్సవము

తిరుపతి, మార్చి 27 : తిరుపతి దేవస్థానం అధికార్లు నిన్న శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యోత్సవము సందర్భమున దిగువతిరుపతిలో వెలసియున్న వేల్పులకును, కొండమీద అన్నమాచార్య, పెద తిరుమలాచార్యుల విగ్రహముల సమక్షమున శ్రీ వేంకటేశ్వరస్వామికిని ప్రసాద విశేషములతో ప్రత్యేకారాధన జరిపిరి.

శ్రీ అనంతకృష్ణ శర్మగారు, వీరయ్య చౌదరిగారు, లక్ష్మణశాస్త్రిగారు అన్నమాచార్య సంకీర్తనములను పాడిరి. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తాళ్ళపాకవారినిగూర్చి నాటి యుత్సవ ప్రసక్తిని గూర్చి ప్రసంగించిరి. బంగారువాకిలి ముందు ఒకప్రక్క తాళ్ళపాక అన్నమాచార్య తిరుమలాచార్యులను, ఎదురుగా స్వామిని దర్శించుచు దేవస్థానోద్యోగులు, తిరుమలవాసులు, యాత్రికులు, ఉత్సవ దిన్నావార్థం వచ్చిన పౌరముఖ్యులు పలువురుగల గోష్ఠిలో ఉపన్యాసము, సంకీర్తన గానము జరుగుట తాళ్ళపాకవారిమహనీయతను, స్వామివైభవమును వెల్లడించుచు సన్నివేశము పారవశ్యపరచినవి. ఆరాధన సందర్భంలో విలువగల ప్రసాదములు ప్రజలకు పంచిపెట్టబడెను.

# ఉ. వి. జిల్లా హోమియోపతి వైద్యుల సమావేశం

చికాకోల్, మార్చి 27 : ఉత్తర విశాఖజిల్లా హోమియోపతి వైద్యుల సమావేశం డా॥ లంక సూర్యప్రకాశరావు అధ్యక్షతను చికాకోల్ పురమందిరంలో జరిగెను. ఆంధ్రరాష్ట్ర హోమియోపతి వైద్యుల సంఘ కార్యదర్శి డా॥ టి. సుబ్రహ్మణ్యంగారు మాట్లాడుచు ప్రస్తుతం వైద్యవృత్తి చేయుచున్న హోమియోపతి వైద్యులను రిజిష్టరు చేయుటకును, హోమియోపతి ఔషధముల వ్యాప్తి చెందించుటకును 'అఖిలభారత హోమియో కౌన్సిలు'ను ఏర్పాటు చేయవలెనని చెప్పిరి. జిల్లా సంఘ కార్యదర్శి దుద్ది దేవేంద్ర దేవుగారు నివేదిక చదివిరి. క్రొత్త సంవత్సరమునకు డా॥ లంక సూర్యప్రకాశరావుగారు అధ్యక్షులుగను, దుద్ది దేవేంద్ర దేవుగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి.

### నన్నయజయంతి సాహిత్యసభలు

తణుకు, మార్చి 28 : స్థానిక నన్నయ సేవాసమాజమాధ్వర్యాన నన్నయ జయంతి సాహిత్యసభలు యీ నెల 30నుండి ఏప్రిల్ 6 వరకు తణుకులో జరుగును.

# 'నేషనల్ సేవింగ్సు వారం'

నెల్లూరు, మార్చి 27:-ఈపురమందున, జిల్లాలోని యితర కేంద్రములందును 'నేషనల్ సేవింగ్సు వారోత్సవములు' జరుపబడినవి. ఈ సందర్భంలో నిన్న సాయంకాలము యిక్కడ జిల్లాకలెక్టరు ఆర్. ఎస్. మలయప్పన్‌గారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగెను. అధ్యక్షులు ప్రసంగిస్తూ సేవింగ్సువిధానము అన్నితరగతుల వారికి శ్రేయము కూర్చుననియు, ప్రతివారు తమ సొమ్మును శక్తికొలదివారములో వెలెననియు యిట్లు చేయుటవలన తమకు, తమకుటుంబాలకు సహాయం చేసుకొనుటయేగాక, ప్రభుత్వం వారు తక్షణం నిర్వర్తింపవలసిన నిర్మాణ కార్యక్రమానికి సహాయపడిన వారగుదురనియు, అందుచే ప్రతివారు 'నేషనల్ సేవింగ్సు పత్రములను' కొనవలెననియు చెప్పిరి. జిల్లా అగ్రికల్చరు మొదలగు కొందరు ఉపన్యసించినఅనంతరం సభముగిసెను.

### నిడదవోలు

స్థానిక రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగారి ఆధ్వర్యమున 'నేషనల్ సేవింగ్సువారము' జరిగెను. ప్రతివారు తమధనమును మితంగా వ్యయంచేసికొని, దేశపునర్నిర్మాణానికి సహాయపడవలసిందని ఇన్‌స్పెక్టరుగారు విజ్ఞప్తి చేసిరి.

### కడప

ఈ నెల 25 వ తేదీన 'నేషనల్ సేవింగ్సువారం' సందర్భంలో కళాశాల భవనంలో కేప్టెన్ ఎం. ఎం. అబ్దుల్‌గాని అధ్యక్షతను ఒక బహిరంగసభ జరిగెను. ప్రజలు మితవ్యయమభ్యసింపవలసిన అవసరమును గూర్చియు, ఆ ద్రవ్యమును ప్రభుత్వం ప్రజాహిత కార్యముల నిర్వహించుటకు యివ్వవలసిన అవసరమునుగూర్చియు పలువురు ప్రసంగించిరి.

### తిరుపతి

'నేషనల్ సేవింగ్సు వారం' సందర్భంలో చిత్తూరుజిల్లా పంచాయతీ పాలనాధికారి అధ్యక్షతను తిరుపతి దేవస్థాన పాఠశాలలో బహిరంగసభ జరిగెను. శ్రీ వెంకటేశ్వర కళాశాలా ధ్యాపకులు వి. వి. రామానుజస్వామిగారు మాట్లాడుతూ భారతదేశప్రజలు ఆర్థికాభివృద్ధికి తోడ్పడవలెనని చెప్పిరి.

### చికాకోల్ పురపాలక సంఘ సమావేశం

చికాకోల్, మార్చి 28 : ఈ పురపాలకసంఘసమావేశం నిన్న సాయంకాలం డా॥ వైనేని వెంకట్రావు నాయుడుగారి అధ్యక్షతను జరిగినప్పుడు మునిసిపల్ సభల్ని టిలోను రాష్ట్రపతి పట్టాభి, గాంధీజీల చిత్రపటములను ఉంచుటకును, చెన్నపట్నంలో జరిగె వయోజనవిద్యా మహాసభకు వైనేని వెంకట్రావు నాయుడుగారిని ప్రతినిధిగా పంపుటకును తీర్మానించిరి. స్థానిక మునిసిపల్ హైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగానున్న టి. వి. ఎల్. నరసింహారావుగారిని గుంటూరుజిల్లా బోర్డువారు తమ హైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగా బదలీచేయవలసిందని కోరుచూ చేసిన విజ్ఞప్తినమసరించి వారిని బదలీచేయుటకు పురపాలక సంఘం తీర్మానించెను.

### పసుపులగ్రామంలో అగ్నిప్రమాదం

కర్నూలు, మార్చి 27 : ఈ తాలూకా పసుపుల గ్రామంలో మొన్నరాత్రి అకస్మాత్తుగా నిప్పు అంటుకొని గడ్డివాములు దగ్ధమైపోయినవి: ఆస్తినష్టము సుమారు 10 వేల రూపాయలుండునని తెలియుచున్నది.

### పాండురంగాపురంలో స్ఫోటకం

భద్రాచలం, మార్చి 27 : ఈ తాలూకా పాండురంగాపురంలో స్ఫోటకం వ్యాధి ఉధృతంగా వ్యాపించి యున్నది. ఇప్పటికి 35 మందికి వ్యాధితగిలి ఒకరు మరణించిరి. వ్యాధి నిరోధమునకు ఆరోగ్య శాఖవారు తీవ్రంగా కృషి చేయుచున్నారు.

### ప్రాథమికోన్నత పాఠశాల భవననిర్మాణ సంఘం

నిడదవోలు, మార్చి 27: ఈ ఫిర్కాలోని పలువురు ప్రముఖులు మొన్న సాయంకాలం సమావేశమై నిడదవోలు ప్రాథమికోన్నత పాఠశాల భవన నిర్మాణ సంఘమును ఏర్పాటుచేసిరి. జుబ్బవరపు బ్రహ్మన్నగారు అధ్యక్షులుగను, తెల్లా ప్రగడ ప్రకాశరాయుడుగారు కార్యదర్శిగను ఎన్నికైరి.

### రాజమండ్రి కంప అడితీ కూలీల సమ్మె

రాజమండ్రి, మార్చి 25: వేసవిలో కూలి రేట్లు హెచ్చించవలెనని కలప వర్తక సంఘం వార్కి అడితీల కూలీలు కోరిన కోరిక ఫలించని కారణంచేత నేటి ఉదయంనుండి యిచ్చటి కలప అడితీలలోని కూలీలు సమ్మెచేయ నారంభించిరి. అల్లరులు జరుగకుండా అడితీలచుట్టు రిజర్వ పోలీసులు కాపలా కాయుచున్నారు.

# గాంధీహత్య కేసు ముద్దాయిలు

## న్యాయవాదులను ఎంచుకొను విషయమై నిబంధన

సిమ్లా, మార్చి 29: గాంధీ హత్యకేసు నిందితులు తూర్పు పంజాబు హైకోర్టుకు సంబంధించని న్యాయవాదులను తమతరఫున వాదించుటకు నియమించుకోరాదని తూర్పు పంజాబు హైకోర్టు ఆజ్ఞాపించినది. ముద్దాయిల కివ్వబడిన పట్టికలోనుండి మాత్రమే తమ న్యాయవాదులను ఎందుకో వలెనోకూడ వారికి స్పష్టీకరింపబడినది.

బొంబాయి హైకోర్టులోని న్యాయవాది డాంగే మాత్రం తూర్పుపంజాబు హైకోర్టులో ముద్దాయిల తరఫు న్యాయవాదిగా హాజరు కావచ్చును.

తమ న్యాయవాదులకు స్వయంగా కొన్ని విషయములు తెలుపుటకు తమ్ము అనుమతించవలసినదని ఆప్టే, గోపాల్ గాడ్సే, మదన్‌లాల్, పెట్టిన దరఖాస్తులను ప్రధాన న్యాయమూర్తి ఆలోచించుచున్నారు.

ముద్దాయిల అప్పీళ్ళపై విచారణ జరుగు మే 2వ తేదీన పోలీసు కట్టుదిట్టములు బాగా చేయబడునని తెలియుచున్నది.

# తిరుపతి పురపాలక ఉన్నత పాఠశాల వార్షికోత్సవం

తిరుపతి, మార్చి 27: ఈ పురపాలక ఉన్నత పాఠశాల తృతీయ వార్షికోత్సవం శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి అధ్యక్షతను మొన్న జరిగెను. పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. దేవాశీర్వాదంగారు వార్షిక నివేదికను చదివిరి. తర్వాత పి. సుబ్రహ్మణ్యకవిగారు ఉపన్యసించిరి.

శ్రీ హరిసర్వోత్తమరావుగారు ప్రసంగిస్తూ దేశంలోని ప్రజలందరు స్త్రీ, పురుష భేదం లేకుండా విద్య నేర్చుకోవలెననియు, విద్యార్థులకు బోధింపబడు విద్య భవిష్యత్తులో వారికి అక్కరకు వచ్చేదిగాను, దేశ పురోభివృద్ధికి సహాయపడునదిగాను ఉండవలెననియు చెప్పిరి. వీరరాఘవులుగారి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసెను.

# 'నగారా' పత్రిక కార్యాలయం సోదా

తెనాలి, మార్చి 27 : నిన్న సాయంకాలం సర్కిల్ ఇనస్పెక్టరు బి. రామస్వామినాయుడుగారు రిజర్వు దళంతో పెళ్లి మానీసు పేటలో శ్రీ కొడుమంచి వెంకటేశ్వరరావుగారిచే నడుపబడుచున్న 'నగారా' యను పక్షపత్రికా కార్యాలయాన్ని సోదాచేశారు. ఆ పత్రిక 20 మార్చిసంచికలో 'ఖమ్మంమెట్టు కేసు' అను హైదరాబాదుకు సంబంధించినవార్త ప్రకటించినందుకుగాను యీ సోదా జరిగినది. ఆవార్తను ప్రకటించిన సంచికలన్నియు పోలీసువారు స్వాధీనపరచుకొనిరి. సర్కిల్ ఇనస్పెక్టరుగారిని అడుగగా ఆ వార్త అసలుకు విరుద్ధముగా ప్రకటించిరనియు, అందువలన తాము స్వాధీనపరచుకున్నామని తెలిపిరి. (స్వ. వి)

# గాంధి స్మారకనిధి వసూళ్లు

విశాఖపట్నం, మార్చి 30:

విశాఖపట్నంజిల్లా కాంగ్రెసు సంఘం అధ్యక్షుడు శ్రీ పసుమర్తి వీరభద్ర ఎం. ఎల్. ఏ. గారు ఇట్లు వ్రాయుచున్నారు:—

గాంధీజాతీయ స్మారకనిధి వసూళ్లు ఏప్రిలు నెలాఖరుతో అంతమగును. జిల్లాలో వసూళ్ల నిమిత్తం రసీదు, కూపన్ల పుస్తకములు తీసుకున్న మిత్రుల ద్వారలో వసూళ్లు పూర్తి చేయవలెనని కోరుచున్నారు. వసూళ్ల నిమిత్తం ఈ క్రింద వివరించిన తేదీలలో తాలూకాలలో సంచారం చేయబడును. తాలూకా ముఖ్యపట్టణములలో మిత్రులు నన్ను కలుసుకోవలెనని కోరుచున్నాను.

వీరవల్లి ఏప్రిలు 5, నరసాపట్నం 6, సర్వసిద్ధి 7, అనకాపల్లి 8, లీపురుపల్లి 10, సాలూరు 11, బొబ్బిలి 12, పార్వతీపురం 13, పాలకొండ 14, భీమునిపట్నం 15. భూములకు దరఖాస్తులు పెట్టిన రాజకీయ యోధులు ఆ తేదీలనే కలుసుకోవచ్చును.

# తాలూకా కాంగ్రెస్ సంఘాల ఎన్నికలు

సత్తిశాలూకా కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షులుగా ఎల్. శ్రీరామరెడ్డి, కార్యదర్శిగా కె. సంకటరెడ్డి, కోశాధికారిగా కె. రాధాకృష్ణయ్యగార్లు ఎన్నికైరి.

కందుకూరు తాలూకా కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షులుగా సుందరపనేని పట్టాభిరామస్వామిచౌదరి, ప్రధానకార్యదర్శిగా సుబ్రం వెంచయ్యనాయుడు సహాయ కార్యదర్శులుగా జక్కెర్ల కృష్ణయ్య, కరవది వేమగిరిరావుగారు ఎన్నికైరి.













Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press.
No. 7, Thambu Chetty Street, G. T. Madras.